శ్రీరస్తు

శ్రీ గురుభ్యోనమః

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# శ్రీహరి శతకము

ఇది

శిగంపల్లి గ్రామవాస్తవ్యులగు

## ఊలపల్లి గంగరాజమంత్రి

విరచితము

మొదటికూర్పు 1000 ప్రతులు

## గుండు లక్ష్మణశాస్త్రిచే

సరిచూడఁబడినది

రాయవరమున

మల్లిడి సత్తిరెడ్డిగారి శ్రీ మేరీముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

గ్రంథకర్తచే ప్రకటింపఁబడినది

**1935**

 [వెల రు **0-2-0**]

# ప్రశంస

ఈ శ్రీహరి శతకమును నే నామూలాగ్రముగా జదివితిని. మృదుమధుర శైలిగాను భక్తిరస ప్రధానముగా నున్నది. గ్రంథకర్తగారు భగవద్భక్తిప్రధానులగుటచే నీ శతకము భక్తిరసమును వెల్లడించుచున్నదనుట వింతగాదు. నేను చాలగ సంతసించితిని.

ఇట్లు

21—9—1935
వేళంగి
కాకినాడ తాలూకా

ఉభయభాషా విద్వత్కవి విధేయుడు
గుండు లక్ష్మణశాస్త్రి

---

ఈ దిగువ నుదహరించిన వారి ద్రవ్యసహాయమున ముద్రింపబడెను.

శ్రీ నండూరి వెంకట్రావుగారు
శ్రీ వత్సవాయ ధర్మరాజుగారు
శ్రీ వత్సవాయ బుచ్చిరాజుగారు
} రంగాపురము

శ్రీ వల్లి సూరన్నగారు — బిక్కవోలు

సహాకారులు

శ్రీ సోమిశెట్టి గోవిందరావుగారు
శ్రీ మట్ట అప్పయ్యగారు
} బిక్కవోలు

శ్రీరస్తు

శ్రీ గురుభ్యోన్నమః

# శ్రీ హరి శతకము

ఉ. శ్రీరమణీమణీ ప్రియుని ♦ సేవను జేయగ నెంచినట్టి నన్
గారవ మొప్ప నీ కరుణ ♦ గల్గగ జేసియు బ్రోతువంచు నే
గోరితిగాన నా కిపుడు ♦ గోరికలొప్పగ నిచ్చి బ్రోవుమా
సారవిహీనమౌ తనువు ♦ సార్థకమౌనె దలంప శ్రీహరీ! 1

ఉ. శ్రీ యురమున్ వసింపగను ♦ శ్రేయముగోరుచు నుండి పాముపై
హాయిగఁ బవ్వళించు నిను ♦ నక్రమతోడను గొల్వ శక్యమా
తోయజలోచనా యిటుల ♦ దోచియుఁ దోచక వేడుచుంటి నే
నీయెడ నిన్నుగొల్చుటకు ♦ నీప్సితమియ్యగదయ్య శ్రీహరీ! 2

ఉ. శ్రీకర నీ దయారసమె ♦ శ్రేయమటంచును చిన్ని పొత్తమున్
నీ కరుణాకటాక్షమున ♦ నేను రచింపగ నెంచియుంటికన్
నా కథయుం బొసంగుమని ♦ నమ్మి మదిన్ నినుగోరుచున్ సదా
సాకుచునుంటి సాంగముగ ♦ సాగగ జేయగదయ్య శ్రీహరీ! 3

ఉ. శ్రీగణనాథ నీదు పద ♦ సేవ లొనర్చియు బూజచేసియున్
బాగుగ ధూపదీపములు ♦ పాయసమాది యనేక భక్ష్యముల్
వేగమె నీకొసంగి కడు ♦ వేడుకతోడ ననేకరీతులన్
సాగిలి మ్రొక్కుచుంటి కృతి ♦ సాగగ జేయుము విఘ్ననాయకా! 4

ఉ. పాణిని వీణబూని యొక ♦ పాణిని పొత్తముదాల్చి ధాతకున్
రాణివటంచు గోరి యను ♦ రాగముతో నిపుడేను గొల్చెదన్
వాణి కృపాకటాక్షమున ♦ వాక్కున నిల్చియు బ్రోవుమమ్మ నా
పాణులుమోడ్చి మ్రొక్కెదను ♦ భారము నీదెగదమ్మ భారతీ! 5

ఉ. నన్నయ శంభుదాసు పెద ♦ నార్యుల బమ్మెర పోతనార్య తి
క్కన్నను భీము ధూర్జటిని ♦ గౌరన తిమ్మన తిమ్మనార్య సూ
రన్నను రామలింగకవి ♦ రాజులనెల్లను సంతసంబునన్
సన్నుతి జేతు మత్కృతికి ♦ సారసశోభ విలక్షణార్థమై.

ఉ. వింటి ననేకశాస్త్రములు ♦ వేదపురాణము లాదిగాగ నీ
కంటెను వేరు లేరిలను ♦ గావను బ్రోవను రాగదయ్యా నా
కంటెను దీను లీధరణి ♦ గానగ లేరని విన్నవించెదన్
కంటికి రెప్పరీతి నను ♦ గావగ వేడెద బ్రోవు శ్రీహరీ! 7

చ. పుడమిని మానవుండగుచు ♦ పుట్టుట శ్రేయము పుట్టియుండియున్
ఎడపక దైవభక్తి మది ♦ నెప్పుడు వర్తిలుచుంట మేలుమేల్
గడుకొని దానధర్మముల ♦ గాలముబుచ్చుట మాచిదంచు రీ
వెడనెడ మాటలేల యని ♦ వేడుకలన్ మనుచుంద్రు శ్రీహరీ! 8

ఉ. బాల్యమునందు నిన్గొలువ ♦ బాల్పడ నేరని వాడనైతి వా
త్సల్యము నాపయిం జొనుపు ♦ తావరసాక్షు దయాసముద్ర కౌ
టిల్య మెరుంగడంచు విక ♦ టీకృత చిత్తుడు గాడటంచు సా
కల్యముతో సనారతము ♦ గావుము సన్నుతి జేతు శ్రీహరీ! 9

ఉ. మానవ జన్మమెత్తి యభి ♦ మానము వెంటగ నంటియుంటచే
గానవిలోల నీదు పద ♦ కంజము లెన్నడు గొల్వలేక స
న్మానములేని పామరుల ♦ మానక గొల్చుచునుంటి బేలనై
మానెద మానెదింక యను ♦ మానమదేలను బ్రోవు శ్రీహరీ! 10

ఉ. నిత్యముగాని యీయొడలు ♦ నిర్మలభావము బాపి కల్లలా
సత్యములెల్ల బల్కుటకు ♦ సంభ్రమమేలను గల్గియుండెనో
నిత్యము జేయబోవు కడు ♦ నీమములెల్లను నీదుమాయెగా
మృత్యువు గానకుండగనె ♦ మేదినిలో నినుగొల్తు శ్రీహరీ! 11

చ. అమరులు పొందు బాధలను ♦ నా వనజాసనుడాదిగా సురల్
విమలమనంబుల న్విహిత ♦ వేదవిధి న్వినుతించి దెల్పగా
అమలసుధాసమంబయిన ♦ యక్కటికంబును వీడి వారలన్
కమలవిలాసినీరమణ ♦ గాచెదనంటివిగాదె శ్రీహరీ! 12

ఉ. పాపపుజాతి బాలిశుల ♦ పాల్పడి యోర్వగలేక బుణ్యులౌ
తాపసముఖ్యులాదరము ♦ దానవులన్ దెగటార్పగోరుచున్
నీపదసేవ జేయగనె ♦ నేర్పున వారల బ్రోచినట్టి యో
శ్రీపతి నీకుసేవకుడ ♦ శీఘ్రముగా నను బ్రోవు శ్రీహరీ! 13

ఉ. కుక్షిని జీవకోటి సమ ♦ కూర్చియు నీభువనంబు లన్నియున్
రక్షణ సేయుగాదలచి ♦ రాత్రిబవళ్లనిశంబు గాచుటన్
పక్షము లేనివాడవని ♦ పాపవిదూరుడ నౌటెరింగి నే
శిక్షల కాగలేననుచు ♦ శీఘ్రమె మ్రొక్కెద బ్రోవు శ్రీహరీ! 14

ఉ. ఎన్నడు నిన్ను నే మరువ ♦ నేదరిజేర్చిన నీదె భారమౌ
సన్నుతిజేసి యొంతయును ♦ సాగిలి మ్రొక్కుచునుంటి బ్రోవుమో
పన్నగశాయి నామమది ♦ పామరభావ మడంగజేయుమా
కన్నడ శాయకయ్య నను ♦ గావుము మ్రొక్కెద నీకు శ్రీహరీ! 15

ఉ. ఎందరు నిన్నెరుంగకయు ♦ యేమరి యీ యిహసౌఖ్యసంపదల్
సుందరులైన దారలను ♦ సోదర బాంధవ మిత్రభావముల్
సందడి జూచుచున్నదిని ♦ సంబరమొందుచునుందు వెఱ్ఱులై
ముందరిదారి గానరది ♦ మూర్ఖపుచిత్తులుగారె శ్రీహరీ! 16

ఉ. కాయము శాశ్వతంబనుచు ♦ కానకచేతురు పుణ్యపాపముల్
తోయమటంచు మావుగని ♦ దూరముబారు మృగంబులై వడిన్
ప్రాయము బోవకుండగనె ♦ ప్రాజ్ఞుడుగా నెరుంగనేర్చునే
తోయజనేత్ర నిన్గొలువ ♦ దోచకపోయెను బ్రోవు శ్రీహరీ! 17

ఉ. మాయను దాటఁగా వశమె ♦ మానవకోటి కనేకభంగులన్
బాయును సాహజాలములు ♦ ప్రాజ్ఞులు నీపదసేవ జేసినన్
యీయెడ నిన్ను నేఁగొలువ ♦ నీప్సితమబ్బుట నీకటాక్షమే
కాయము నమ్మలేదికను ♦ గావఁగ మ్రొక్కెద నిను శ్రీహరీ! 18

ఉ. మానవు డెవ్వడేని కడు ♦ మాన్యుడునై చరియించుమన్ సదా
దానవిశేష ధర్మపథ ♦ ధైర్యములెల్లను గల్గియుండినన్
గానవిలోల నీదు పద ♦ కంజము లెన్నడు గొల్వనట్టి యా
హీను డికెన్నిసార్లు వని ♦ హేయపు జన్మములెత్తు శ్రీహరీ! 19

ఉ. చుట్టలు దొంగలేయనుట ♦ చోద్యముగాదు దలంచిచూడఁగా
గట్టిగ దేహసంపదలు ♦ గల్గుచునుండెడు కాలమందు నే
పట్టుననైన బాంధవులు ♦ బాగుగ మూగి యదిందొలంగగా
పిట్టలమాడ్కి బోవుదురు ♦ ప్రేమనువీడియు వారు శ్రీహరీ! 20

ఉ. ఆసకు మేరలేని జను ♦ లందరిమాటలు వీనుల న్వినన్
మోసము గాకమానదని ♦ ముందుగ పెద్దలు చెప్పుటన్ సదా
భ్యాసము చేయు నన్ను పరి ♦ పక్వఫలాప్తుని చేయుగా మదిన్
నీసములైన దైవముల ♦ నెందు కనుంగొనజాల శ్రీహరీ! 21

ఉ. హెచ్చుగ నాలుబిడ్డలును ♦ హేమమయంబగు భూషణంబులన్
మెచ్చుచునుండువారలిక ♦ మేదినియందు నిమందలంచకే
యచ్చపు చీకటిం దిగుగు ♦ లాడెడు జంతువుపోల్కినుండు నీ
సచ్చరితంబుల న్నుడువ ♦ జాలెడు కోర్కెనొసంగు శ్రీహరీ! 22

ఉ. పచ్చని చేలముల్ మిసిమి ♦ బాగొనగూర్చి ధరించువాడవై
ముచ్చటతోడ భక్తులకు ♦ మోదమొసంగుచునుండుటన్ సదా
సచ్చరితంబులం నుడివి ♦ సాకుచునుండెదు గాన నేనికన్
యిచ్చజరింప నేర నిను ♦ నీభువనంబున గొల్తు శ్రీహరీ! 23

ఉ. చక్కెరతీపు కెక్కుడుగ జాలెడు నీదగు నామమంత్రమే
నిక్కమటంచు గోరకను నిర్మలభావముతోడ గొల్చి నే
మ్రొక్కుచునుండగా నికను మోదముసంగుము బ్రోవరాదె నా
దిక్కని నమ్మి యుంటి కడు దీనుడ నన్ గృపజూడు శ్రీహరీ! 24

ఉ. ఎక్కడ నీకు నామముల నేమరకుండ దలంచుచుందురో
నిక్కపుభక్తి గల్గుటను నేర్పున గీతము బాడుచుందురో
చక్కగ తాళమేళముల జాగరమెవ్వరు జేయుచుందురో
యక్కడివారి వారి సఖు లాదర బ్రోతువు నీవు శ్రీహరీ! 25

ఉ. మరి మరి నీదు నామ మహి మాతిశయంబు నెరుంగలేరుగా
కరి నిను గోరగా నపుడె కాచి భయంబును దీర్చి బ్రోవవే
గిరిజలమందు క్రుంగగనే కేవలమౌనిన్ భంగుమొందుచున్ సురల్
మురహర మాధవాయనగ మోయగలేదె నగంబు శ్రీహరీ! 26

చ. ధనమును దాచనేగ యిల ధర్మము నైనను జేయనెప్పుడున్
మనమున నీదు నామ మహి మంబును స్తోత్రము జేయనేరకే
దినములు వ్యర్థభావమున దీర్చుచునుండె నాడు గాన నీ
ఘనకరుణారసంబునను గావగ వేడెద బ్రోవు శ్రీహరీ! 27

చ. పరులమనంబు నొవ్వగను బల్కితి నేర ననేకభంగులన్
ఒరులకు మోసమౌననుచు నోపినయట్లు నటించుచుండెదన్
మరువగ లేదు నా కొరులు మంచివటంచును దెల్పశాస్త్రముల్
గురుతొనగూర్చు భావమున గోరుచునుంటిని బ్రోవు శ్రీహరీ! 28

చ. మలినపుకొంప రోగముల మగ్గెడు నేవపుగంప జంతు సం
చలనము నొందుదుంప భవ సాగరమీదగ నీనికంప నె
మ్ములు పలలమ్ము తోలు నర ముల్ పయికప్పు దలంప మేను ని
శ్చలమని నమ్మలేను మన సార నుతించెద బ్రోవు శ్రీహరీ! 29

ఉ. బాలరసాల సాల నవ ♦ పల్లవముల్ దిను కోయిలల్ భువిన్
చాల గృశించియైన బహు ♦ చక్కగ నా కుటజంబు జేర న
ట్లేలనొ నా మనం బిపుడు ♦ యిప్పటి సౌఖ్యములెల్ల గోరకే
మేలగు నీదు నామమును ♦ మించియు లేదని గోరె శ్రీహరీ! 30

ఉ. చక్కగ నా మనం బనెడు ♦ సంకెల వేసెద నీ పదంబులన్
ఒక్క యుగంబునుం గదల ♦ నోపగనీయను నిక్క మాచిదే
మ్రొక్కెద మ్రొక్కెద న్నియు ♦ మ్రొక్కెదనా మొగలాలకింపునో
వెక్కసపాటులేక నిను ♦ వేడెద బ్రోవుము నన్ను శ్రీహరీ! 31

ఉ. పొందుగ నీ పదాబ్జములు ♦ పూజలుసేయగ నేరకున్న నీ
సుందరమైన నామమును ♦ సొంపు నెరింగి దలంపకున్న నే
మందును వాని నీ యిలను ♦ మానవులం దధముండుగాన నే
మందుడ నాపయిన్గ్రుపను ♦ మన్ననసేసియు బ్రోవు శ్రీహరీ! 32

ఉ. మ్రొక్కెద నీ చరాచరము ♦ మోదముతో సృజియించువానికిన్
దిక్కులు చంద్రభాస్కరులు ♦ తేజము నీ భువనంబు లన్నియున్
చక్కగ బ్రోచువానికిని ♦ సాగిలి వందన మాచరించుచున్
దిక్కని నమ్మియుంటి కను ♦ దీనుడ నన్ గృపజూడు శ్రీహరీ! 33

ఉ. మ్రొక్కెద నీపదంబులకు ♦ మోదము సంగెదవంచు గోరి నే
నిక్కపుదాసునై గొలుతు ♦ నీ కృపజూపియు బ్రోవుమా యికన్
వెక్కసపాటు జూపకను ♦ వేగమె నాపయి ప్రేమవీచికల్
చక్కగజూపవే యనుచు ♦ సాగిలి మ్రొక్కెదనయ్య శ్రీహరీ! 34

ఉ. రాముడెదిక్కటంచు మది ♦ రాజసమంతయు వీడి గోరుటన్
ధీమసవంతుడై దనరి ♦ దేవునియం దనురాగయుక్తుడై
తామసమంత బోవిడిచి ♦ ధన్యతనొందునటంచు శాస్త్రముల్
నా మనమందు నెప్పుడును ♦ నమ్మి నటించెద బ్రోవు శ్రీహరీ! 35

ఉ. రామకథాప్రసంగముల ♦ రంజిలఁజేయఁగ నెంచి నా మదిన్
నీమముబూని యేమరక ♦ నేరుపెరింగినయట్లు వ్రాసి నే
కోమలమైన కోరికలు ♦ కూరిమిమీరఁగ దీర్చెదంచు ని
న్నో మహనీయ గోరెదను ♦ నొప్పఁగఁ బ్రోవఁగదయ్య శ్రీహరీ! 36

ఉ. ఏక్షణమందు నిన్గొలువ ♦ నేర్పఁగఁజేయుమనుండువాఁడనో
నాక్షణమందె నిన్దలతు ♦ నా కథయుం బొసఁగంగ గోరి నే
దీక్ష వహించియుంటి కడు ♦ దీనుఁడ దబ్బరసేయకయ్య యో
పక్షవిపక్షదూర నిను ♦ ప్రార్థనఁజేతుఁగదయ్య శ్రీహరీ 37

ఉ. పక్షములేనివాఁడవని ♦ పాదములంబడి వేఁడుచుంటి నా
కక్షయమైన కోర్కెలిడు ♦ మంబుజలోచన యో రమామనో
రక్షక నాదు ప్రార్థనము ♦ రంజిలఁజేయుదు నీ మదిన్ జగ
ద్రక్షక బ్రోవ నీ కిపుడు తప్పదు ♦ తెప్పదుసుమ్ము శ్రీహరీ! 38

చ. ఎవరిని వేఁడుకొందు నిక ♦ యేమనిగోరుదు యేమిసేయుదున్
భువనములెల్ల గాచుటకు ♦ భోగిపయిం బవళించువాఁడ రే
దివమును నేత్రయుగ్మముల ♦ దెల్పు రమావర సారసాక్ష నా
భవములడంచి బ్రోవదగు ♦ బంధుఁడవీవెగదయ్య శ్రీహరీ! 39

ఉ. ఎక్కడి తల్లిదండ్రి సుతు ♦ లెక్కడి మంత్రివయస్య కోటియున్
నెక్కడిసోదరీమణులు ♦ యెక్కడిబంధు లదెంతచిత్రమో
ముక్కున నూపిరాడఁగనె ♦ మోదముతో జనువారలేకదా
దిక్కిఁక లేదు లేదు భువి ♦ దీనుఁడ నన్ గరుణింపు శ్రీహరీ! 40

ఉ. నీరజలోచనా యనుచు ♦ సన్నుతిజేసెడు వారి పాపముల్
కూరిమితోడఁ బోనడచి ♦ కోరినకోర్కెలొసంగెదంచు యీ
ధారుణియందు నీతిపథ ♦ ధర్మమనాదిగనుండెగాన నే
చేరి నమస్కరించుచును ♦ చిత్తమునందున గొల్తు శ్రీహరీ! 41

ఉ. మావటివాడు బుద్ధి యను ♦ మాన మదేభను మొంచిచూడ ష
డ్భావవికార మా గజము ♦ భారగ దాఁ గదియించి కట్టగా
గావలె నంకుశంబనెడు ♦ కంజదళాక్షుని నామమే సదా
గావలెగాని వేరొకటి ♦ గానగరాదనుమాటి శ్రీహరీ! 42

ఉ. రంగనిభక్తిచే నెపుడు ♦ రంజిలుచుండెడి వారలీ పురిన్
పొంగుచు దానధర్మములు ♦ పూనికతోఁ గృత జేయుటన్ సదా
మంగళమూర్తి నా హరియె ♦ మంచిశుభంబు లొసంగుగాన యే
భంగము రాకయుండుటకు ♦ ప్రార్థన జేయుచునుందు శ్రీహరీ! 43

ఉ. తాపసియైన కౌశికుడు ♦ దాశరథీయని రామచంద్రునిన్
యేపున జేరి నా మఖము ♦ నేమరకుండగ గాచి బ్రోవ నీ
ప్రాపుకు గోరుచుంటినని ♦ ప్రార్థన జేసిన యా క్షణంబునన్
దాపున మాయదానవిని ♦ దర్పమడంచినయట్టి శ్రీహరీ! 44

ఉ. రాజగు నంబరీషుడిల ♦ గన్యాతరంబగు నీదు భక్తిచే
యీ జగమందు పేరుగాంచెను ♦ నిడుములొప్పమటంచు నెంచుమన్
భూజములాదిగాఁగలుగు ♦ భూమిజనించు చరాచరాంగలన్
రాజసకాంక్షవిడి యను ♦ రాగపు తాపసిగాడె శ్రీహరీ! 45

ఉ. వాసవుడాది దేవతులు ♦ వన్నెజలంగగ మొక్కునట్టి దూ
ర్వాసుడు నంబరీషు నను ♦ రాగము తోడను జూచి భిక్షుకై
మోసము జేసి నాకిడక ♦ ముందు భుజించితివంచు నెంచి నా
యాసము నొందజేయ నపు ♦ డాతడె గోరడె నిన్ను శ్రీహరీ! 46

ఉ. నీ మహనీయమైన కథల ♦ నేను కనుంగొనజాలువాడనా
నామనమందు నీ దయను ♦ నమ్మికగట్టెడునట్లు జేయుమా
పామరభావమెప్పుడును ♦ పాల్పడనీయక బ్రోవుమయ్య నిన్
నే మరవంగబోనెపుడు ♦ నిన్ను నుతించెద గావు శ్రీహరీ! 47

ఉ. కాలునిదూతలన్ గదిమి ♦ గాచెదువారలు లేరుగా యిలన్
కోలలబాధ మాన్పగను ♦ కూరిమితో గన నీదు నామమే
జాలునుగాని వేరొకటి ♦ జాలదటంచును దెల్పు శాస్త్రముల్
శీలముగాన నే నటుల ♦ చిత్తమునందు దలంతు శ్రీహరీ! 48

ఉ. బుద్ధిమరల్పలేక బహు ♦ భోగపరుండయి యుందు నాతడున్
వృద్ధుడునైనగాని కడు ♦ వృద్ధమనస్కుడు గాక నాశకున్
బద్ధుడునౌట మానదది ♦ పాపపయోధి గడంగ శక్యమా
యుద్ధర నిన్ను నే గొలువ ♦ నీప్సితమబ్బగజేయు శ్రీహరీ! 49

ఉ. పంచశరద్వయస్కుడయి ♦ ప్రాజ్ఞతగల్గిన యట్టి బాలునిన్
ద్రుంచగబోవు తండ్రిగని ♦ తోయజలోచన ని పదాబ్జముల్
అంచితభక్తిచే గొలువ ♦ నాతని నీ కృప బ్రోచినట్టి నిన్
మంచిమనంబుతో నిపుడు ♦ మానకగొల్చెద బ్రోవు శ్రీహరీ! 50

ఉ. సీతనుజూడ మారుతియు ♦ సింధువు దాటుచు లంకజొచ్చి నీ
చేతను నందు ముద్రికను ♦ జేత ధరింపగజేసి మ్రొక్కి భూ
జాతను జూచినా ననగ ♦ చాలగ సంతసమంది వెంటనే
సేతువుగట్టి రావణుని ♦ సేనలతో బరిమార్పవే హరీ! 51

ఉ. దానవవైరి నీ చరణ ♦ దాసుల దాసుల దాసుడయ్యెదన్
మానవజన్మ మెత్తుటను ♦ మాయనుదాటగలేక వెఱ్ఱినై
గానవిలోల నీదుపద ♦ కంజములన్మది గొనుచుంటి నే
ధ్యానముజేయుటే నెరుగ ♦ ధన్యునిజేయగదయ్య శ్రీహరీ! 52

ఉ. అక్రమవర్తనంబుగల ♦ నందర శిక్షలజేయగన్ సదా
చక్రిసుసాధనంబునను ♦ సన్నుతిగాంచుచు నున్నయట్టి యో
విక్రమమూర్తి నిన్ బొగడ ♦ వేయుశిరంబులవాని శక్యమా
జక్రిదయాంబురాశి యని ♦ సాగిలిమ్రొక్కెద బ్రోవు శ్రీహరీ! 53

చ. పదులకు నెక్కుడై దనరు ♦ పాపవిమోచన నీదునామమున్
వదలగలేను నీ స్మరణ ♦ వాంఛితమబ్బుట నీ కటాక్షమే
పదముల కేను మ్రొక్కెదను ♦ పాపములున్ననుగాచి బ్రోవు మో
సదమలమూర్తి నీ భజన ♦ సాగగ గోరుచునుంటి శ్రీహరీ! 54

చ. తెలియక మోసపోయి వసు ♦ దేవుని సూనుల కంసు డాయెడన్
మలినమనంబుతోడ గని ♦ మన్నన జేయక హింసజేయగన్
నలినదళాక్ష నీ మహిమ ♦ నా కలుషాత్ముని మాయ లోనుగా
నలవడ జేసి యాక్షణమె ♦ నందునిసూనుడవైన శ్రీహరీ! 55

ఉ. కేశవ నీ పదాబ్జములు ♦ కేవలమున్ గొనియాడ నేరకన్
యాశను దాటలేని జను ♦ లాడెడు మాటలు నిందలంచు పే
రాశను జుట్టగాచెదు న ♦ రాధములన్ దరియంగ ధ్యానమే
శ్రీశ రమేశ గాచునట ♦ శీఘ్రమె బ్రోవగదయ్య శ్రీహరీ! 56

ఉ. నీరములాదు నీ కునికి ♦ నీదుమహాత్వ మెరుంగు పెద్ద లిం
పారగ దెల్పు గ్రంథముల ♦ భారమునంతయు జూడజూడగా
కోరిన గోర్కె లన్నియును ♦ కూరిమితో దయసేయువాడవై
శ్రీరమణుండవైన నిను ♦ చిత్తమునన్ దలపోతు శ్రీహరీ! 57

ఉ. వైరికి సోదరుం డితడు ♦ వానివధింపుమటంచు బల్కుచున్
వీరపరాక్రమంబునను ♦ వేగమె బల్కెడు భానుసూనునిన్
జీరి పరాభవంబిపుడు ♦ జేయగరాదనునంతలోనె నిన్
గోరగ నా విభీషణుని ♦ కూరిమి బ్రోచినయట్టి శ్రీహరీ! 58

ఉ. తప్పులుగాచిబ్రోచుటకు ♦ దాతవు నేతవటంచు నే నినున్
తప్పక గొల్చుచుంటి ♦ యమదండన కోర్వగజాల గావుమో
యప్ప రమామనోహర ♦ భయార్తుడ నన్ గృపజూడవేమి నే
నెప్పుడు గోరలే దొరుల ♦ నేమరువాడనుగాను శ్రీహరీ! 59

ఉ. మీగడ పాలమించి బహు ♦ మేలు నొసంగెడు నీదు నామమున్
బాగుగ జిహ్వతో బలుక ♦ బాయును పాపములంచు విటికన్
సాగగ జేయగోరుచును ♦ సన్నుతి జేసెద నీ పదాబ్జముల్
భోగము గోరలే దిపుడు ♦ బ్రోవుము మ్రొక్కెదనీకు శ్రీహరీ! 60

ఉ. వెన్నకు నెక్కుడౌ మృదువు ♦ వేడుకజూపెడు నీదునామమున్
సన్నుతిజేయ నా తరము ♦ సాగిలి మ్రొక్కుచునుంటిగాని యో
పన్నగశాయి నీ కృపకు ♦ పాత్రుడనన్ కరుణించి బ్రోవుమా
మన్ననతోడగొల్చెదను ♦ మంచిపథంబొనకూర్పు శ్రీహరీ! 61

ఉ. బాలురజూచి యా దనుజ ♦ పాలుని బాలుడు జీర వారలున్
చాలగ సంతసించి కడు ♦ సంబర మొందుచు నిట్టిబంధునిన్
బాలురలోన లేడనుచు ♦ బంతులునాడుట మానివచ్చి గో
పాల హరేయటంచు నిను ♦ ప్రార్థనజేసిరిగాదె శ్రీహరీ! 62

ఉ. బాలకులార మీ రిటుల ♦ పాల్పడ నేమిఫలంబు మాధవున్
శీలముతోడ గొల్వగను ♦ శ్రేయమొసంగునటంచు బల్క నా
బాలురు నీ కథల్వినుచు ♦ ప్రస్తుతిసేయుచు నాట్యమాడి గో
పాల హరేయటంచు నిను ♦ ప్రార్థనజేసిరిగాదె శ్రీహరీ! 63

ఉ. నీరమునించుభాండమును ♦ నెమ్మదిగా పయి మూతవేసియున్
కూరిమి కట్టెలన్ పొదివి ♦ ఘోరతరాగ్ని వెలుంగజేయుచో
నీరము తప్తమానటులె ♦ నీల్గు నఘంబులు జ్ఞానవహ్నిచే
శ్రీరమణుండవైన నిను ♦ చిత్తమునన్ దలపోతు శ్రీహరీ! 64

ఉ. మృత్తికతోయమున్ గొనుచు ♦ మెత్తగ కల్పియు ముద్దజేసి యా
మృత్తును సారెపై నునిచి ♦ మేలనురూపము లెన్ని జేయునో
యిత్తరి నీ ప్రపంచకము ♦ నిట్టులొనర్చుచునుండు దేవనన్
మత్తిలియుండ నీకు నిను ♦ మానకగొల్చెద బ్రోవు శ్రీహరీ! 65

ఉ. దిట్టతనంబు మాని యిల ♦ దేవునిగొల్వకయుంట పాడియే
పిట్టలజంపుచో నొకడు ♦ పెద్దయెలుంగిడు నార్తరావ మ
ట్టట్టె వినంగ శౌరియని ♦ యాత్మదలంపగ భక్తుడాయెగా
నట్టుల నన్నుబ్రోవుమిపు ♦ డార్తశరణ్యుడవైన శ్రీహరీ! 66

ఉ. మచ్చికదెచ్చి గోవ్రుకిడ ♦ పాలునొసంగిసదావ్రవన్ పలుల్
మెచ్చెడు మాటలన్నిసిని ♦ మేలునుపొందుమురందు రీ భువిన్
ముచ్చటతోడ నిన్గొలిచి ♦ మోదమునొందుచు బాడుచుంటి నీ
సచ్చరితంబె గానసిక ♦ సంబరమొందెద బ్రోవు శ్రీహరీ! 67

చ. కరి తురగంబులున్ బల ని ♦ కాయములెన్నియొ గల్గియుండినన్
న్గిరిధరు నెప్పుడు న్మదిని ♦ కేవలభక్తి దలంపలేని యా
నరవరు లెన్ని జన్మముల ♦ నైనను మోక్షము జెందలేరుగా
మురహరమాధవా యనుచు ♦ మ్రొక్కెదబ్రోవుము నన్ను శ్రీహరీ! 68

చ. పుడమిని మానవుండు నిను ♦ పూజలుసేయగనేరకున్న వా
డడవిని జంతుజాలముల ♦ యందు ననాధయనందగుంగదా
ఘడియయుగాని లేక యర ♦ ఘంటకు నొక్కసారిగాని నిన్
జడమతిగాక నే దలచ ♦ జాలెదు భక్తి నొసంగు శ్రీహరీ! 69

చ. గడన నెరుంగ నెన్నడును ♦ గాదన నెవ్వరు నేమిసెప్పినన్
ఝుడియక నీ పదాబ్జములు ♦ చక్కగ ప్రార్థనజేయగోరి నే
నడిచెడు వేళలందు మది ♦ యందు దలంపగ నిన్ను నెప్పుడున్
నుడువుచు బాడుచుందునను ♦ నోపికగల్గ జేయు శ్రీహరీ! 70

ఉ. కొట్టములోని ద్రవ్యమొన ♦ గూర్చుచునుండెడు కాలమందు నే
పట్టుననైన బాంధవులు ♦ ప్రాజ్ఞుడటంచును బుజ్జగించు నా
కొట్టము విత్తహీనమయి ♦ గూర్చసమర్థుడు గాకయున్న నా
డిట్టటుమాటలాడుదురు ♦ యేహ్యముజేయుచునుందురు శ్రీహరీ! 71

ఉ. దొంగలుగారె చుట్టములు ♦ దూరము యోచనజేసుకొమ్ము నా
కుంగల యాశచే గలుగు ♦ కోరికలన్నియు దీరదీరగా
వెంగలివంచు కొందరల ♦ వేడుక హీనుడటందు గాన యో
మంగళమూర్తి నిన్నదిని ♦ మానక గొల్చుచునుందు శ్రీహరీ! 72

ఉ. నవ్వులకైన స్త్రీలభ్రమ ♦ నాకెనుగాదని యెంచి చూడగన్
పువ్వులుకాని బారిపడి ♦ పోకలబోయిన మోసమౌగదే
క్రొవ్వటుజేరి కూడుకొని ♦ కోమలరూపపు గుబ్బలాయె నా
చివ్వకు నెప్పుడైన జన ♦ చిత్తము జేర్పడనీకు శ్రీహరీ! 73

ఉ. వంతముతోడ యో పరమ ♦ పావననామ హరే యటంచు నీ
చెంతకు జేరువారలను ♦ చేతులుసాచియు మ్రొక్కువారలన్
వింతయెగాదు బ్రోవగను ♦ వేడుక నికథ వ్రాయుచుంటి నే
గంతులు వైవజాల నను ♦ గావుము నేరనివాడ శ్రీహరీ! 74

ఉ. అల్లరులెల్లమాని జను ♦ లందరు గుంపులుగూడి యా రమా
వల్లభు పాదపద్మములు ♦ వావిరిగా స్మరియించుచుండువా
రెల్లవిధంబులందు పర ♦ మేష్టిపదంబును జేరుదురు నే
కల్లలు నాడలేనిపుడు ♦ గావుము మ్రొక్కెద నీకు శ్రీహరీ! 75

చ. ఎడతెగలేని నీకరుణ ♦ కెప్పుడు పాత్రులు గాకయుందురే
అడవుల సంచరించినను ♦ యందు తపం బొనరించియుండినన్
సుడిబడకుండ జీవతతి ♦ శోభనము ల్పనుకూరనేర్చునే
గోడవలు చాలుకుంటి నిను ♦ గోరితి బ్రోవగరాదె శ్రీహరీ! 76

చ. కరిరథఘోటకంబులును ♦ కాంచనమెంతయు గల్గియుండినన్
గిరిధరు నామసారమును ♦ కేవలము స్మరియించి చూడగా
నరమరలేక కేశవుని ♦ యందలి భక్తియె శ్రేయమంచు యో
కరివరదా నినుందలతు ♦ గావుము మ్రొక్కెద నీకు శ్రీహరీ! 77

చ. పుడమిని మానవుండు తను ♦ పూర్వము జేసిన పుణ్యపాపముల్
గుడుచునుగాని వేరొకటి ♦ కూడగ రాదది యెట్టులన్నచో
నడవిని తేనెటీగగతి ♦ నంతయుజూచిన తేటగానగున్
గడనయెమానుకొట్టినను ♦ గావుము మ్రొక్కెదనీకు శ్రీహరీ! 78

చ. గడననెరింగి కూర్చినను ♦ గానడదెప్పుడునైన గుడ్చినన్
గొడవలు మానలేడనెడు ♦ గూఢజనంబు మనంబుదెల్పెదన్
పుడమినిజల్లు విత్తులను ♦ పుణ్యఫలంబును జూపుచుండెగా
తడబడనేల యాఫలము ♦ దాగదు యెంచగనేల శ్రీహరీ! 79

చ. చిలుకనుబెంచి రామ యని ♦ జీరుట నేర్పిన కీరవాణికిన్
ఫలమధికంబుగా గలుగు ♦ భద్రములైన పదంబొసంగ నే
దలచుచు పాటబాడుచును ♦ దాసుల దాసుడనంచు మ్రొక్కెదన్
బిలచిన నంతలోనె నను ♦ ప్రేమను బ్రోవగరాదె శ్రీహరీ! 80

ఉ. చక్రముచేత దానవుల ♦ చంపుచు భక్తుల గాచువాడ నీ
విక్రమ మెన్నగాదరమ ♦ వేదపురాణములందు దెల్ప నే
వక్రములేని చిత్తమున ♦ వావిరిగా నిను గొల్చుచుండెదన్
విక్రమమూర్తి నిన్నెపుడు ♦ వేడ్కదలంచెద బ్రోవు శ్రీహరీ! 81

ఉ. అంబరమాదిగా దిశల ♦ నన్నిటనుండెడు జంతుజాలముల్
డంబములేనివాడవయి ♦ డాంబికభావము జూపుచున్ సదా
అంబరమాదిభూషణము ♦ లన్నినొసంగిన యట్టిదేవ నిన్
సంబరమొందుచున్నెపుడు ♦ సాగిలిమ్రొక్కెదబ్రోవు శ్రీహరీ! 82

ఉ. వేదలజూచి మానవుడు ♦ ప్రేమదలిర్పగ నాదరించుచున్
మోదముతోడ నన్నమును ♦ ముందుగ వారి భుజింపజేసి క్షు
ద్బాధ దొలంగజేయుటయె ♦ బాగుగ నీమది మెచ్చునట్లుగా
వేదపురాణగాథలను ♦ వింటిని నీమహిమంబు శ్రీహరీ! 83

ఉ. కప్పుర ముప్పు జూడ నొక ♦ కాంతి జెలంగుచునుండుగాని యా
యుప్పునకున్న గౌరవము ♦ యొప్పునె కప్పుర మెప్పుడీయిలన్
తప్పక కుచ్చితుండెపుడు ♦ ధార్మికుతో సరిగాడు కావునన్
వొప్పుగ నిన్నుగొల్చెదను ♦ వోపినయట్టుల బ్రోవు శ్రీహరీ! 84

ఉ. మేలొనగూర్చువానియెడ ♦ మేలునొసంగుట చోద్యమాయిలన్
కాలము దేశపాత్రలను ♦ గన్గొనుచుండెడు మానవాళికిన్
మేలునడంచువాని కడు ♦ మెచ్చుచు మేలొనరించి బంప సం
శీలముతోడ బ్రోతువని ♦ శీఘ్రమె నే నినుగొల్తు శ్రీహరీ! 85

ఉ. న్యాయమెరుంగు మానవుని ♦ యందలి ప్రాయము నెంచరాదటన్
వాయువు వీచుచుండినను ♦ వన్నెజలంగెడు గాజుకుప్పెలో
మూయుచు దీపముంచి యది ♦ ముద్దుల బాలుని చేతికిచ్చినన్
బాయునెదాని కాంతి బహు ♦ భంగుల యోచన సేయ శ్రీహరీ! 86

ఉ. కామము వీడజాలకను ♦ కన్నుల కింపగునట్టి దేదియున్
ప్రేమను కోరకూడదని ♦ పెద్దలు జెప్పెడు మాట లెప్పుడున్
నామనమందు నేమరక ♦ నమ్మినటించుచు పెద్దకాలమున్
నీమము బూనజాలకయె ♦ నేనిటు మ్రొక్కెద బ్రోవు శ్రీహరీ! 87

ఉ. ముందుగ నీ ప్రపంచమును ♦ ముద్దుగ సృష్టినిజేసి జీవు లా
నందముగాసృజించి భువి ♦ యందు ముదంబుచునొంద జేయుచున్
నందరిలోన సాక్షిగను ♦ నాపద బాపెడువాడ నీపద
ద్వంద్వము కేను మ్రొక్కెదను ♦ దాశరథీ దయ బ్రోవు శ్రీహరీ! 88

చ. మురుగుచుకుంట నీరుగని ♦ మోదమునొందెడుయూరపంది బల్
సరసగుణాఢ్యులుండు సభ ♦ సంతసమందెడు నాసువాసనల్
గరిమను మెచ్చునట్టులనె ♦ గౌరవహీను డెరుంగ నేర్చునే
అరమరలేక నిన్బొగడు ♦ నట్టి కథామహిమంబు శ్రీహరీ! 89

చ. కనుగొన మేడిపండెపుడు ♦ గాంతిజెలంగుచు నూడుగాని లో
దినుటకు దాని దీయగనె ♦ దేలును బుర్గులు పైన లేవుగా
కననగు నట్లు కుచ్చితుని ♦ కమ్మనిమాటలు వీనులింపగున్
మనమున నెంచలేను నిను ♦ మాకభయం బునొసంగు శ్రీహరీ! 90

చ. పరసతి గూడువారలకు ♦ పాపముచెందుట మా దెప్పకున్
గురుసతియైన తారకటు ♦ గూడుటచే శశి బొందు లాభమున్
మరువకవి టి గాన నటు ♦ మందగుణంబును బొందకుండగా
వరమునొసంగి బ్రోవుమని ♦ వద్దికతో నినుగొల్తు శ్రీహరీ! 91

చ. హరిహరి నీదు నామమును ♦ నందరు బాడుచునుండునంత నే
గిరివలె బెర్గుపాపములు ♦ క్రిందకు కృంగినశించు గాన యో
గిరిధర నీమహామహిమ ♦ కేవల సాత్వికభావులైన యా
పరమమునీంద్ర వాక్కనుచు ♦ బాగుగ వ్యాసులుదెల్పె శ్రీహరీ!92

చ. నినునెరుగంగకన్ నెగగు ♦ నేర్పున వీణను చేత బూనియున్
ఘనముగ మూడులోకములు ♦ గానము జేయుచు నారదుండటన్
మనమున శంకదోప నొక ♦ మానినిరూపము దాల్చ జేసి నీ
ఘనమగు నా ప్రభావమును ♦ గన్గొనజేయగ లేదె శ్రీహరీ! 93

ఉ. నారదసూను లందరును ♦ నాటిదినంబును నాదిగా యిలన్
వారలపేరులున్ నరుస ♦ వాడుకతో ప్రభవాది నామముల్
గారవమొప్పగా నుడువ ♦ కారణమై దనరారె గాన నా
కోరినకోర్కె దీర్పుమని ♦ గోరుచునుంటిని బ్రోవు శ్రీహరీ! 94

ఉ. కోపము పాపమూలమని ♦ కోవిదులెప్పుడు బల్కుచుండెగా
కోపము నాపలేననెడు ♦ కొంటెగుణంబును మానకున్నచో
భూపతియైనగాని కడు ♦ పూజ్యత పొందగ నేరడంచు ల
క్ష్మీపతి వాక్యమంచు శశి ♦ శేఖరు డాడడెమున్న శ్రీహరీ! 95

ఉ. కాముని బారిమాన్పుటకు ♦ కంజదళాక్షుని నామమే సదా
నీమముతోడ నే జనుడు ♦ నేమరకుండ దలంచుచుండినన్
కామునితండ్రి వారలను ♦ గాచుచు బ్రోవునటందు రీ భువిన్
బాముల నొందకుండ నను ♦ బాగుగ బ్రోవగదయ్య శ్రీహరీ! 96

చ. తిలలును నీరు చేలములు ♦ దెచ్చి సుగంధము జల్లునంత నే
నలవడుగా సువాసనలు ♦ నట్టులె సద్గుణకోటిస్నేహమున్
దలగకనుండె నేని ప్రమ ♦ దంబున బ్రోచెదవంచు నింటికన్
దలచెద నీదునామమును ♦ ధన్యమనస్కునిజేయు శ్రీహరీ! 97

ఉ. భానునికాంతిచే తిమిర ♦ భార మడంగినయట్టులే సదా
దీనులుజేయు పాప మతి ♦ తీవ్రతరంబగు నీదు నామమున్
వీనుల విందుజేయగను ♦ వేగ నశించునుగాన నే నికన్
దీనుడనంటి నీకృపను ♦ దేల్చియు పాపముబాపు శ్రీహరీ! 98

ఉ. నేరనివాడనైతి నిక ♦ నీ కరుణారసదృష్టిజూపి నా
నేరము సైపగోరెదను ♦ నీరజనాభ దయాసముద్ర నే
మేరను దాటలేదెపుడు ♦ మేదినియందున నెట్టి కోరికల్
గోరను నీకటాక్షమును ♦ గోరుచునుంటిని బ్రోవు శ్రీహరీ! 99

ఉ. కర్మము జేయగోర తగు ♦ కారణసూత్రము లెట్లుగల్గెనో
మర్మమెరుంగువారలను ♦ మానవులందున లేరుగాన యా
మర్మము నీయధీనమని ♦ మంచిగ నెంచెగదా పురాణముల్
కర్మమునొందకుండ నను ♦ గావుము మ్రొక్కెదనీకు శ్రీహరీ! 100

ఉ. వింతయెగాదు నిన్బొగడ ♦ వింటి ననేక పురాణగాథలం
దంతయు నీదునామ మహి ♦ మాతిశయంబని దోచెగాన నే
డింతకు నాదు పూర్వకృత ♦ మిప్పుడు నిన్ను దలంపగోరె నీ
చెంతకుజేరి మ్రొక్కుటకు ♦ చిత్తముజేరగజేయు శ్రీహరీ! 101

చ. అతిశయభక్తిచే భజన ♦ లందరు జేయుచు నెప్పుడు న్సదా
స్తుతినొనరించు మానవుల ♦ శోభనముల్ సమకూడ జేసియు
న్సతతము బ్రోచువాడవని ♦ సన్నుతిజేయుచు నీ పదాబ్జముల్
గతియనినమ్మియుంటినను ♦ గావుము మ్రొక్కెద నీకు శ్రీహరీ! 102

ఉ. అక్కట నా సుయోధనుడు ♦ నందరయోధులతో రణంబునన్
చక్కగ గూడియుండగను ♦ చయ్యన పార్థుడు వారిజూచి నా
కిక్కడివారు బంధులని ♦ యెంచుచు జాలినిబొంది జంపగా
నిక్కముగాను పాపమని ♦ నీకును మ్రొక్కెనుగాదె శ్రీహరీ! 103

ఉ. కొంచెముగ్రోధముండగనె ♦ గొప్పగుమానము బాడుజేయు నా
కొంచెము శాంతముండినను ♦ గొప్ప సుకీర్తి జెలంగుచుండియున్
మంచిదలంగ నీ కెపుడు ♦ మానము ప్రాణము గాచుచుండియున్
నంచితమైన లాభమును ♦ నందును నిందునుపొందు శ్రీహరీ! 104

ఉ. మర్మమెరుంగలేక నభి ♦ మానము బూనిన మానవుం డిలన్
కర్మనుజుట్టు నప్పసిరి ♦ కాయపురుంగులచాడ్పునం సదా
కర్మనుబాపు నేర్పెరుగ ♦ గానరు నీ పదభక్తిలేమిచే
నిర్మలమైనజ్ఞానమును ♦ నేరనుగావుము నన్ను శ్రీహరీ! 105

ఉ. పుట్టువెరుంగ డెన్నడును ♦ భోగపరుండగు టెట్టులెర్గునో
గిట్టుట కొంతెరుంగునని ♦ కేవలభక్తులు దెల్పుచుండెగా
గట్టిగ నీదుపాదములు ♦ గాఢతరంబగు భక్తితోడనే
పట్టియు మానకుండ నిను ♦ బాగుగ వేడెద బ్రోవు శ్రీహరీ! 106

ఉ. విత్తముజేర్చగోరి మది ♦ వేడుకతోడ ననేకభంగి నా
యత్తముజేయగావలయు ♦ నంచు ననేకులు బల్కువింటి న
న్నిత్తెరి నట్లు నా మదిని ♦ యింపొనగూర్పక నీదుధ్యానమున్
చిత్తముగోరునట్లు నను ♦ జేయుము మ్రొక్కెద నీకు శ్రీహరీ! 107

ఉ. తాతలు తండ్రి దాయలును ♦ దాచిన విత్త మదెప్పుడైన నీ
భూతలమందు మానవులు ♦ పొందు టబద్ధ మదెట్టులన్న నా
తాతయు తండ్రి యార్జనలు ♦ దమ్మిడికైనను నిల్వలేమిచే
నీతు లెరుంగజాల నను ♦ నీ పదభక్తుగ జేయు శ్రీహరీ! 108

ఉ. దారసుతాదు లందరును ♦ తధ్యమటంచును నమ్మినట్లుగా
గోరగనిచ్చి యా పిదప ♦ గూఢతరంబగు ప్రేమదోప నే
వారల రక్షణార్థ మని ♦ వారితమైన విధంబుల న్సదా
కూరిమితోడనుండి నిను ♦ గోరగ నేరనివాడ శ్రీహరీ! 109

ఉ. ఆశనువీడి కేశవుని ♦ నాత్మదలంచినయట్టి వారలన్
దోసములెల్ల బోనడచు ♦ తోయజనేత్రుడటంచు వింటిగా
నీసములైనవేల్పులను ♦ నేనిక గానగలేనటంచు నన్
మోసముజేయబోకు విను ♦ మో కరుణాకర బ్రోవు శ్రీహరీ! 110

ఉ. మానవుడెప్పుడు న్మదిని ♦ మానుకొనందగు క్రోధముబ్బులన్
మానగ గర్వము న్వదల ♦ మంచిసమంబగు యుక్తినుండ స
న్మానము పొందుచుండునని ♦ మాన్యులుగూడ వచించియుండె నే
గానగ నెంతవాడ నను ♦ గావుము మ్రొక్కెద నీకు శ్రీహరీ! 111

ఉ. చక్కెర పాలు మీగడలు ♦ చాలగ సంతసమొందుచున్ సదా
మెక్కుటకన్న మీ స్మరణ ♦ మేదినియందున మేలొసంగుటన్
నిక్కముగాను నేనిపుడు ♦ నెమ్మదిలోన దలంచుచుంటిగా
వెక్కసమా దయారసము ♦ వేగమె నాయెడజూపు శ్రీహరీ! 112

ఉ. లోకమునందు నేజనుడు ♦ లోభగుణంబునువీడి యెప్పుడు
న్నాకలిగొన్నవానికిడు ♦ నన్నము దేవుని తృప్తిజేయుచున్
చేకొని మోక్షమిచ్చునని ♦ జెప్పిరి పెద్దలు నే నశక్తుడన్
గైకొనిబ్రోవు నీ కిదుదు ♦ కానుక యుత్పలమాల శ్రీహరీ! 113

చ. అవనిని మానవుం డెవని ♦ యాకలిదీర్చుట కన్నమిచ్చినన్
భవములడంచి వాని బహు ♦ భంగుల గా చెదవాచు వేదముల్
దవిలి బురాణముల్ దెలిపె ♦ తద్దయు నేనటుజేయ లేమిచే
కువలయమాలగాగొనుము ♦ గూర్చితిచంపకమాల శ్రీహరీ! 114

చ. దశరథు కాత్మజుండితడు ♦ దానవుల న్బరిమార్చునట్లుగా
విశదముజేసె శాస్త్రములు ♦ వేదబురాణములందు నెప్పుడున్
దశదిశలందు నీమహిమ ♦ దాచగనేరికి శక్యమా యిలన్
వశమగునానినున్ బొగడ ♦ వార్ధకమాలను బ్రోవుశ్రీహరీ! 115

ఉ. పొందుగ నీపదాబ్జములు ♦ పూజలుజేయగగోరి నేనిటన్
సుందరమైన నామముల ♦ సొంపుగ నుత్పలమాల గొన్నియున్
సందియమేలనింక కొన ♦ సాగగ చంపకమాల వృత్తముల్
ముందిడికాన్కగాగొనియు ♦ మోదముతోననుబ్రోవు శ్రీహరీ! 116

ఉ. పొందుగ నూలపల్లి కుల ♦ పూర్ణుడు వేంకటరామ మంత్రికిం
పొందగ సూనుడై దనరి ♦ పుణ్యకృతంబున గంగయాఖ్యచే
నిందలచంగ నాయుదిని ♦ నేనుపెరుంగనివాడ దాసుడన్
సందియమొంద నేల నిక ♦ సాగిలిమ్రొక్కెద బ్రోవు శ్రీహరీ! 117

ఉ. సందియమొందెదేల నిక ♦ సర్వచరాచర జంతుకోటి నిం
పొంద దయారసంబునను ♦ బ్రోచెదువాడవటంచు వింటి నే
మందుడ నాపయిన్గృపను ♦ మంచిదొలంగక నీయుగోరి నీ
సుందరమైననామమును ♦ సొంపుగ వ్రాసినవాడ శ్రీహరీ! 118

ఉ. మంగళ మేనొసంగెదను ♦ మానిత దివ్యపదాబ్జముల్ మదిన్
సంగతెరుంగలేక మును ♦ సాగిలి మ్రొక్కగలేనివాడనై
వెంగలినైన నామొడను ♦ వేగమె నీకృపజూపి బ్రోవు మో
మంగళమూర్తి నిన్నెపుడు ♦ మానకగొల్చెద బ్రోవు శ్రీహరీ! 119

శ్రీహరి శతకము సమాప్తము.